# వేగంగా వెళ్లిన

# గాడిద

ఫిలిప్పైన్స్ జానపద కథ



ఒక వ్యక్తి దగ్గర చాలా కొబ్బరి కాయలు ఉన్నాయి. అతడు వాటిని పట్టణంలో అమ్మాలని అనుకున్నాడు. కొబ్బరి కాయలను గాడిద మీదకి ఎక్కించాడు.



పట్టణం చాలా దూరం.



దారిలో అతడికి ఒక పిల్లవాడు కలిశాడు.





“పట్టణం వెళ్లటానికి ఎంత సమయం పడుతుంది?" ఆ వ్యక్తి అడిగాడు.





“మీరు వేగంగా వెళితే చాలా
సమయం పడుతుంది,"
పిల్లవాడు చెప్పాడు.

“కానీ మెల్లగా వెళితే తొందరగా
చేరుకుంటారు."

ఆ పిల్లవాడు పిచ్చివాడనీ,

నోటికి వచ్చింది ఏదో వాగాడనీ

ఆ వ్యక్తి అనుకున్నాడు.







“నా గాడిద చాలా వేగంగా వెళుతుంది," ఆ వ్యక్తి అన్నాడు.

“నీ కంటే ముందుగా నేను పట్టణం చేరుకుంటాను. "

తరవాత అతడు తన గాడిద తోపాటు

పట్టణం వైపు వేగంగా వెళ్లసాగాడు.



గాడిద చాలా వేగంగా వెళుతుండటంతో
కొబ్బరి కాయలు ఒకటొకటిగా కింద
పడిపోసాగాయి.
కొంచెం సేపటికి గాడిద వీపు మీద ఉన్న
రెండు బుట్టలూ ఖాళీ అయిపోయాయి.





కాసేపటికి ఆ వ్యక్తి విశ్రాంతి తీసుకోటానికి ఆగాడు.

“అయ్యో," అతను అరిచాడు.

“నా కొబ్బరి కాయలు ఏమయ్యాయి?"



తరవాత ఆ వ్యక్తి వెనక్కి వెళ్లి ఒకటొకటిగా కొబ్బరి కాయలు ఏరసాగాడు. దీనంతటికీ అతడికి చాలా సమయం పట్టింది.



ఎట్టకేలకు ఆ వ్యక్తి పట్టణం చేరుకునే సరికి బాగా రాత్రి అయ్యింది.



ఆపాటికి అబ్బాయి పట్టణం చేరుకోవటమే కాకుండా తన కొబ్బరి కాయలు అమ్మేశాడు.



“మెల్లగా వెళ్లటమే ఒక్కొక్కసారి మంచిదని నీకు చెప్పాను కదా,” ఆ పిల్లవాడు అన్నాడు.

తానే పిచ్చివాడినని ఆ వ్యక్తికి అప్పుడు అర్థమయ్యింది.

अंत



